ప్రకాశకులు:

శ్రీ అరవింద సొసైటి.
తెలుగుశాఖ.
శ్రీ అరవిందాశ్రమము.
పుదుచ్చేరి-605002.

ప్రతులు: 500
ఆగస్టు 1974.





వెల: రు. 1-50

ముద్రణ:

ఆంధ్రభవన్ ప్రెస్,
శ్రీ అరవిందాశ్రమము,
పుదుచ్చేరి-605002.

# పరిచయము

శ్రీమాతారవిందుల అనుగ్రహము ఆశీర్వాదములతో శ్రీ అరవింద సొసైటి తెలుగుశాఖ చిన్న తెలుగు ముద్రణాలయమును నిర్వహించుచున్నదని తెలుపుకొనుటకు ఆనందించుచున్నాము. ఇందులకు పూర్తి సహకారము నొసంగుచున్న శ్రీ అరవింద సొసైటివారికి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ సదవకాశమును సద్వినియోగముజేయ, పరమ పవిత్రమైన యీ శుభదినము—15-8-74—న "భారతీయత-దాని నిజతత్త్వము" అను పేరుతో యీ చిన్న పుస్తకమును తెలుగువారికి పరిచయము చేయగలుగుచున్నందులకు ఆనందిస్తున్నాము.

## "భారతీయత-దాని నిజతత్త్వము"

శ్రీ అరవిందులు రాజకీయనాయకులుగ స్వాతంత్ర్య సముపార్జన ప్రియులకు సుపరిచితులే. కాని, యోగిగను, ద్రష్టగను, పూర్ణయోగావలంబులుగను, అతిమానసావతరణకు కారణభూతులుగను, దివ్యజీవన ప్రతిష్ఠాపకులుగను, సర్వతోముఖ వికాసమునకు పూర్ణ అవతారపురుషులుగను కొందరైనను గుర్తించియుందురనుటలో సందేహము యెంతమాత్రము లేదు. పూర్ణపురుషులైన శ్రీ అరవిందులు, భారతదేశ ఔన్నత్యత, నాగరికత, సంస్కృతి, సర్వమానవ సమైక్యత దృష్ట్యా కొన్ని కొన్ని సందర్భములందు వారు తెలిపిన, వ్రాసిన విషయములయొక్క అనువాదమే యీ చిన్న పుస్తకము. ఈ శీర్షికక్రింద మరికొన్ని సంపుటములు వెలువడనున్నవి.

మరియు శ్రీమాతారవిందులు తెలిపిన: శ్రీ అరవిందాశ్రమము, పూర్ణ యోగవిధానము, దాని ఆవశ్యకత మొదలగు విషయములుకూడ సంక్షిప్త ముగ వివరించుటయేగాక చదువరులకు 'భారతీయత' యొక్క పూర్ణతత్త్వము నందలి వొక్కొక్క అంశమును క్రమముగ ఈ శీర్షిక క్రింద విపులీకరింప గలుగుదుమని విశ్వసిస్తున్నాము.

ఇందులకు హృదయపూర్వకముగ సహకరించిన అనువాదకర్తలు, డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తంగారు (యం.ఏ., పిహెచ్.డి.; పి.జి. సెంటర్, గుంటూరు), శ్రీ వి.వి.యస్. రామదాసుగారు (హైదరాబాదు) తెలుగువారికి సుపరిచితులు. బ్రహ్మశ్రీ వేలూరి చంద్రశేఖరంగారు— జగమెరిగిన బ్రాహ్మ ణుడు. మా ప్రార్థనల నంగీకరించి, వెంటనే అనువాదములను పంపి తోడ్పడినందులకు, వారికి మా కృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాము.

ఈ పుస్తకముయొక్క ప్రయోజనమును ఏ కొలదిమంది యైనను పొందగలిగిన, మా ప్రయత్నము సిద్ధించినట్లుగనె భావింతుము.

పుదుచ్చేరి-605002
15-8-74

తెలుగుశాఖ
శ్రీ అరవిందాశ్రమము

# విషయసూచిక

# శ్రద్ధాంజలి

అరవిందమా!
అరుణారవిందమ!!
అందుకొనుమా వందనము
లరవిందమా!!

శాంతసరసిని నిల్చి నీ హృ
త్కాంతు లాశాంతమ్ము బంపుచు
మౌన ముద్రను ప్రబోధింతువు
జ్ఞాన సకలమ్మున్॥ ॥అరవింద॥

కృష్ణ జన్మస్థానమున శ్రీ
కృష్ణ దర్శన భాగ్యమందితి
నిష్ఠతో ఆధ్యాత్మ జగతికి
తృష్ణ తీర్పంగన్॥ ॥అరవింద॥

నీ మహోజ్జ్వల యోగదృష్టియు
నీ మహోన్నత కావ్యసృష్టియు
స్వర్ణ కాంతులు నింపె మానవ
పూర్ణయోగమునన్॥ ॥అరవింద॥

మానవాధ్యాత్మిక చరిత్రకె
మాననీయము నీదు ప్రభవము
మానవాత్మలలో వినూతన
జ్ఞాన ముదయించెన్॥ ॥అరవింద॥

నీ వికాసము నిండి జగతిని
నవ వికాసము కల్గజేసెను
వివృతమైనవి మా యెడందలు
అమృతమే విరిసెన్॥ ॥అరవింద॥

అభ్యుదయ మీ యర్క కాంతులు
శుభ్రమైనవి యభ్రవీధులు
సుందరం బరవింద శతదిన
నందనోత్సవము॥ ॥అరవింద॥



# సర్వం విష్ణుమయం జగత్

## శ్రీ అరవిందులు

మేము చేపట్టిన జాతీయోద్యమ సందర్భంలో ప్రభుత్వం నన్ను బందీని చేసినపుడు నేను కొంతగా సంచలనం పొందాను. భగవంతుని సంకల్పమేమిటో నాకు అవగతం కాలేదు. నాలో నేను భగవంతునికి ఇలా మనవి చేసుకొన్నాను:

"ఏమిటిలా చేసావ్ ప్రభూ? నేనేదో నా ప్రజకు సేవ చేద్దామనుకొన్నాను. నాకు నీ అండదండలుంటాయని కొండంత ఆశ పెట్టుకొన్నాను. ఏమిటీ అర్థంలేని అభియోగం? ఏమిటీ అన్యాయమైన నిర్బంధం?"

ఒకటి రెండు రోజులు గతించాయి. నన్నావరించిన నిస్తబ్ధత కొంత తొలగిస్తు మూడోరోజు నా అంతర్వాణి నాకిలా వినిపించింది. "సంచలించకు, కొంచెం ఓపికతో నిరీక్షించు." నేను ప్రశాంతి వహించాను. ఆ తరువాత ప్రభుత్వం నన్ను ఆలిపూర్‌కు తరలించింది. ఇరుకైన చిన్నగదిలో నన్ను నిర్బంధించారు. నేను ప్రతిక్షణం భగవద్వాణి నాలకించాలనే నిరీక్షణలోనే ఉన్నాను. భగవంతుడు నాకేమి ప్రబోధిస్తాడో? నా కర్తవ్యమేమిటో తెలుసుకోవాలనే నా ఆరాటం.

నేను నిర్బంధింపబడటానికి ఒక నెల రోజులు ముందుగా నాకొక అనుభూతి కలిగింది. అదే నాకు కలిగిన తొలి ప్రబోధం అనుకొంటాను. నిరంతరం ఏకాంతాన్ని అభిలషించమని; సమస్త బాహ్య కార్యకలాపాలు

కట్టిపెట్టమని; ఆత్మాన్వేషణం గావించుకోమని; ఆ రీతిగా తనతో సన్నిహిత సంబంధం సమకూర్చుకోమని.

నాలోని దౌర్భల్యంచేతనే నేనీ ప్రబోధాన్ని సరిగా ఆలకించలేదు. నేను చేపట్టిన కార్యక్రమం నాకు చాలా పవిత్రంగా గోచరించింది. నేను లేకపోతే అది భగ్నమైపోతుందని నా నమ్మకం. ఎట్టి పరిస్థితుల్లోను దాన్ని విడనాడుకోలేను. తన్నిర్వహణం నాకు గర్వకారణంగా కూడా ఉండేది.

ఆలిపూర్‌లో ఉండగా రెండోపర్యాయం తిరిగి భగవద్వాణి నా అంతరంగంలో ఇలా ధ్వనించింది. "నీవు నా తొలి ప్రబోధాన్ని ఆలకించలేదు. నీవు విచ్ఛేదం చేసుకోలేని బంధాల్ని నీకోసం నేను పటాపంచలు చేసాను. నీవీ రీతి కార్యకలాపాలు నిర్వహించడం నాకేమాత్రం ఇష్టంలేదు. నీకై వినియోగింపబడ్డ కార్యక్రమం వేరే ఉంది. అందుకే నేను నిన్నీ కారాగారములో బంధించాను. ఏకాంతానికి చేర్చాను. నీవు గ్రహించలేని అనేక విషయాల్ని నీకు నేను ప్రబోధిస్తాను. నీవు నిర్వహించవలసిన పనిలో నిన్ను సుశిక్షితుడ్ని చేస్తాను."

ఈ రీతిగా పలికి, భగవంతుడు నా చేతుల్లో "భగవద్గీత" నుంచారు. భగవచ్ఛక్తి నన్నావేశించింది. గీతాసాధనం అవలీలగా చేసాను. కృష్ణ భగవానుడు అర్జునుడుద్వారా ఆశించిందేమిటో; రాగద్వేషాలు నతిక్రమించటమంటే ఏమిటో; 'నిష్కామకర్మ' నిజస్వరూపమేమిటో; సర్వధర్మ పరిత్యాగం అంటే ఏమిటో; సమర్పణం చేసుకోటం ఎలాగో; సమత్వం, ద్వంద్వాతీతస్థితి; మొదలైన గీతా రహస్యాలనేకం కేవలం నాకు బౌద్ధికంగా అవగతం కావటమేకాదు; హృద్గతమై సాక్షాత్కరించాయి. హిందూమత ఆంతర్యం నాకు సమగ్రంగా అవగాహనమైంది. హిందూమతమని; సనాతన

ధర్మమని ఎందరో ప్రస్తావిస్తూ ఉంటారు. వారికి తల్లేశమైనా అవగతం అయివుండదని నేను చెప్పగలను. ఇతర మతాలు ముఖ్యంగా విశ్వాసబద్ధ మైనవి. అవి నియమబద్ధమైనవి కావచ్చు. కాని, 'సనాతనధర్మం' జీవిం చేది. అనుష్ఠానం ప్రధానమైంది. కేవల విశ్వాసమాత్రమైందికాదు. ఆచరణ ప్రధానమైంది. సకల మానవకోటికి ముక్తిని చేకూర్చటానికి చాలా ప్రాచీన కాలంనుండి భారతీయారణ్య వాటికల్లో, ఆశ్రమాల్లో ఈ ధర్మాచరణం జరి గింది. ఈ అనుష్ఠాన మతాన్ని లోకానికి ప్రసాదించటానికి భారతదేశం తలెత్తుకొని జీవిస్తున్నది. ఇతర దేశాలలాగా ఇది స్వార్థపరాయణమైంది కాదు. తన ఆరోగ్యం తనకాయుష్యమని సంకుచితంగా భావించలేదు. తాను ఎంతో బలీయంగా ఉన్నకాలంలోగూడా ఏ బలహీనదేశాన్ని ఆక్రమించాలనే ఆశ ఈ దేశానికే కోశానా లేదు. తాను సముపార్జించిన విజ్ఞానజ్యోతితో ఈ దేశం సకల ప్రపంచాన్ని ఆవరించిన అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చేయ టానికే ఉద్యమించింది. విశ్వశ్రేయస్సు నాశించే తాను అభ్యుదయం చెందా లని భావించింది.

ఈ సనాతన ధర్మస్వరూపాన్ని భగవంతుడు నాకు సాక్షాత్కరించాడు. జైలు అధికారుల అంతరంగాల్లో అనిర్వచనీయమైన మార్పు వచ్చింది. ఆంగ్లేయుడైన జైలు అధికారికూడా ఆర్ద్రహృదయుడై, ఉదయం, సాయం కాలం ఒక అరగంట సేపు జైలు ప్రాంగణంలో వాహ్యాళి వెళ్ళటానికి అవ కాశం కల్పించాడు.

ఈ వాహ్యాళి వేళల్లో భగవచ్ఛక్తి నాలో ఎంతగానో ఆవేశించింది. కారాగారము, నన్ను బంధించిన ఆ మహోన్నత కుడ్యాలు అన్నీ నాకు వాసుదేవాకారంలో సాక్షాత్కరించాయి. నేను వాహ్యాళి వెళ్ళేటప్పుడు ఆవరణ లోని వృక్షరాజాలు శ్రీకృష్ణాకారంలో నన్ను ఆహ్వానింపసాగాయి. జైలు

కాపర్లు, ఇతర ఉద్యోగులుకూడా నారాయణాకారంలో కన్పించారు. చివరకు నేను కప్పుకున్న దుప్పటిలోనుండి శ్రీకృష్ణ మృదు కరాంగుళులు నన్ను స్పర్శించి. నాకు అనిర్వచనీయమైన ఆనందాన్ని ప్రసాదించాయి.

దొంగలు, దారిదోపిడిగాండ్రు, ఖూనీకోరులు.— ఒకప్పుడు నన్ను క్రొత్తగా జైలులోకి చేర్చినపుడు నా వంకచూచి నన్నవమాన పరచినవాళ్ళు ఇప్పుడు నా కత్యంతాప్తమైన నా ఇష్టదైవాకారంలో కన్పింపసాగారు. మళ్ళీ భగవత్ప్రబోధ మీ రీతిగ కలిగింది, "నిన్ను ఎటువంటి ప్రజల మధ్యకు పంపానో చూచావా? ఇలాంటి జాతిని నీవు సముద్ధరించాలి సుమా!"

నాపై మోపిన నేరం విచారణకు వచ్చింది. న్యాయస్థానానికి తీసుకు వెళ్ళారు. నాకు న్యాయాధికారి వాసుదేవుడుగా ప్రత్యక్షమైనాడు. వీరేమిటి? వారేమిటి? "సర్వం విష్ణుమయం జగత్." న్యాయవిచారణ సమయంలో నేనేవేవో సలహాలనిస్తానని ఆశించాడు న్యాయవాది. నేనేమీ మాట్లాడలేదు. మౌనం నన్నావహించింది. న్యాయ విచారణమంతా భగవంతుడే నిర్వహించాడు.

అంతర్వాణి ప్రబోధం నాకు నిరంతరం జరుగుతూనేవుంది. "యువతరం ప్రబుద్ధమైంది. స్వాతంత్ర్య సముపార్జన భారం వాళ్ళు వహిస్తారు. ఆ పని వాళ్ళు చేపట్టారు. వాళ్ళకా రంగం వదలివేయ్. నేను నీలో చేరాను. నీ ద్వారా నేనీ జగత్తు కందీయవలసిన సందేశం వేదేవుంది. దానికి నీవు ఆయత్తం కావలసింది." అనే పల్కులు నన్ను చకితుడ్ని చేసాయి. నా కర్తవ్యం నాకు స్పష్టమైంది.

ఇంతకు పూర్వం నాకెన్నో సందేహాలుండేవి. ఆంగ్లభావన, ఆంగ్ల మనస్కృత ఎక్కువగా ఉండేవి. పాశ్చాత్య వాసనలన్ని మూలమట్టంగా

తుడుచుకొని పోయాయి. మనోవాక్కర్మల్లో హైందవతత్త్వం సుస్థిరమైంది.

నేను బరోడాలో ఉన్నకాలంలో భగవంతుడ్ని సమీపించింది—పెద్ద భక్తుడుగాగాని, జ్ఞానిగాగాని, యోగిగాగాని కాదు. అప్పటి నా ఒకే ఆశయం దేశసేవ చేయటం. అప్పటికి నిజం చెప్పాలంటే పెద్దగా ఆస్తికుడ్నికూడా కాదేమో! నాలో నిరీశ్వరభావాలుకూడా వుండేవి. ఈశ్వరతత్త్వం పూర్తిగా అవగాహన కావాలంటే ప్రారంభంలో నిరీశ్వరత్వం అవసరమేమో అని కూడా అనిపిస్తుంటుంది.

ఇలావున్నా, వేదరహస్యాలేవో అన్వేషించాలనే ఆరాటం నాలో అధికంగా వుండేది. గీతాసత్యం నన్ను ఆకర్షిస్తూనే వుండేది. ఈ హైందవమతములో ఏదో మహత్తరసత్యం ఉన్నదని, దాన్ని తెలుసుకోవాలని ఉంటుండేది.

ఏమైనా, అప్పటికి నేను భగవంతుడ్ని ప్రార్థించింది ముక్తికాదు. దేశసేవచేసే శక్తి. జాతిని సముద్ధరింపగలిగే శక్తి. ఈ ప్రజానీకానికి సేవచేసే మహాభాగ్యం. ఇలా ప్రార్థిస్తూనే ఏవేవో యోగాభ్యాసాలు చేసేవాడ్ని. అటువంటి నా జీవితాశయం ఇప్పుడీ రీతిగా పూర్తిగా మలుపు త్రిప్పబడింది.

భగవద్వాణి మళ్ళీ వినిపించింది. "నీ కర్తవ్యం నీకు విదితంచేసాను కదా!! దీనివల్ల భారతజాతి సముత్థాన మౌతుంది. నీవు త్వరలోనే ఈ కారాగృహంనుండి విముక్తుడవౌతావు. దేశంకోసం అందరిలాగా నీవీ కటకటాల మధ్య ప్రుగ్గిపోవలసిన అవసరం లేదు. నీవు నా ఆదేశాన్ని నిర్వహించు."

ఇంకో సందేశం దాని వెంటనే వినిపించింది. "ఈ ఏకాంత కారాగార వాసంలో ఈ ఏడాదిలో హైందవ మత స్వరూపం పూర్తిగా నీకు

హృద్గతమైందికదా! నీకున్న సందేహాలు నశించాయిగదా! ఈ మతాన్ని సమున్నతంచేసి, ప్రపంచానికి ప్రసాదించాలనేదే నీకు నా ఆదేశం.

ఈ మతాన్ని ఎప్పటికప్పుడు, ఋషులద్వారా, అవతారాలవల్ల, సమగ్రం చేస్తునేవున్నాను. ఇప్పుడది అన్యదేశాల్లో వ్యాపిస్తున్నది. ఇతః పూర్వం నీకు తెలియని ఈ సనాతన ధర్మ రహస్యాలన్నీ నీకు అవగతం చేసాను. నీ సంశయాత్మ నశించింది. విస్మృతి తొలగింది, స్మృతి కలిగింది. నీవు విముక్తి చెందగానే నీ దేశీయులకీ రీతిగా నా మాటగా చెప్పు:

"ఈ సనాతన ధర్మ నిర్వహణ కోసమే ప్రజానీకం ఉత్తిష్ఠం కావాలి. ఇది జగద్ధితాన్ని చేకూర్చేది కావాలి. జగదారాధన చేయటానికే నేనీ దేశానికి స్వేచ్ఛను ప్రసాదిస్తాము. దేశం ఉన్నతిని సాధించింది అంటే సనాతనధర్మం ఔన్నత్యాన్నందుకొన్న దన్నమాట. ధర్మంచేత, ధర్మంకొరకు మాత్రమే భారతదేశం మనుగడ సాగిస్తున్నది. నేను సర్వవ్యాపినని నీకు నిరూపించాను గదా!

నేను ఈ ఉద్యమంలోకూడా ఉన్నాను. దీనికోసం త్యాగాలు చేసే వాళ్ళలోనేకాదు, ఈ ఉద్యమాన్ని వ్యతిరేకించేవాళ్ళలోగూడా వున్నాను. ఎవ రేది చేసినా, అది నా నిమిత్తమే. అది నా పనే."

నా కర్తవ్యం నాకు బోధపడింది. దాని నిర్వహణ కోసమే నా శేష జీవితం ధారపోశాను.

**ఇంతకు "ఈ హైందవమతం అంటే ఏమిటి? ఆ సనాతన శాశ్వత ధర్మమంటే ఏమిటి?"**

నైమిశారణ్యాది పుణ్యక్షేత్రాల్లో, ఋషుల ఆశ్రమాల్లో యుగయుగాలుగా ఈ ధర్మం ఆచరింపబడుతున్నది. ఆర్యజాతి చేపట్టిన ధర్మమిది. ఒకే విధమైన దేశకాల పరిస్థితుల్లో చిక్కుకుపోయిన సంకుచితమతం కాదిది. ఇది శాశ్వతమైంది, విశ్వజనీనమైంది.

దేన్నీ ద్వేషించదిది. అన్ని ధర్మాల్ని స్నేహార్ద్ర హృదయంతో ఆలింగనం చేసుకొంటుంది. విశ్వజనీనం కాని మతమేదీ శాశ్వతంగా ఉండదు. సంకుచితమతం ఏదేని ఒక్క ప్రయోజనం కోసమే యేర్పడుతుంది.

భౌతిక వాదాన్ని జయించగల మతం ఇదొక్కటే. సకల శాస్త్రీయ పరిశోధనల్ని, తాత్త్విక చింతనల్ని అభిమానించి, తనలో అంతర్లీనం చేసుకోగలది ఈ మతం మాత్రమే.

మానవుడికి, మాధవుడికి గల సన్నిహిత సంబంధాన్ని నిరూపించేది ఈ మతమే. భగవంతుడ్ని సమీపించటానికి ఎన్నెన్ని మార్గాలున్నాయో అన్నింటిని క్షుణ్ణంగా అనుభవపూర్వకంగా నిరూపించగల్గింది ఈ మతమే.

భగవంతుడందరిలో వున్నాడని అన్నిమతాలు చెప్తున్నాయి. జీవకోటి అంతా భగవంతునినుండి పుట్టి భగవంతునిలోనే లీనం అవుతున్నదని మాటల్తో మాత్రంకాక అనుభవంలోకి ఈ పరమ సత్యాన్ని తెచ్చుకున్నది ఈ మతం వారే.

ఈ జగత్తు 'వాసుదేవునిలీల' యని తెల్పేది యీ మతమే. ఈ లీలా కలాపంలో ప్రతి జీవికి ఒక పాత్రవుంది. ఇది నిస్తబ్దమైన నిర్జీవమైన పాత్ర నిర్వహణకాదు. సజీవమైన చైతన్యోపేతమైన పాత్రనిర్వహణం.

జీవితంలోని ఏ చిన్న సంఘటనంగాని, ఏ చిన్న వివరంగాని మతం నుండి వేరుపడియుండదీ ధర్మంలో. అమృతత్వంఅంటే ఏమిటో గ్రహించి మృత్యువును జయించటాని కున్మీలించింది ఈ మతం.

ఈ మాట మీకు చెప్పమనే భగవంతుడు నన్నాదేశించాడు. చెప్పేశాను. భారతీయులకు జాతీయత అంటే అది 'సనాతనధర్మం' కాక అన్యమేమీ కాదు. ఈ ధర్మంలోనే పుట్టి, అందులోనే ఈ జాతి అభివృద్ధిగాంచి, లోకానికి ప్రబోధం చేసింది. అది క్షీణిస్తే ఈ జాతి నిస్తేజమౌతుంది. దాని పరిరక్షణమే ఈ జాతి కర్తవ్యం.

(ఉత్తర్పరా ఉపన్యాస సారం)



# విజ్ఞాన కేంద్రం

—శ్రీ అరవిందులు

ప్రియమైన యమ్ !

పి. యస్, తన సోదరుడి కో విలాసం ఇచ్చాడు—యోగినీ చక్రాలు పంపమని. వాటిని నీవు ఆమోదించావని అతడంటాడు. ఇప్పుడు మాకు కావలసిందేమిటంటే అక్కడివాళ్ళు మతానుష్ఠాన పరులేనా:— అనే కాదు. వారు అట్టివారే అని నీవు హామీ నిచ్చావంటాడతడు..........

మతానుష్ఠాన పరులైన ప్రజలు కొందరు బాహాటంగా రాజకీయాల్లో మెలగేవారుకూడా వున్నారు. మత సంబంధమైన ఈ తాంత్రిక పరికరాల్ని అట్టివారికి పంపటం వివేకవంతమనిపించుకోదు..........

౧౫వ ఆగష్టు, సాధారణంగా స్వకీయ సాధనలోను జీవితంలోను, నాకు ప్రత్యక్షంగా గుర్తుంచుకోదగింది. అదో మలుపుత్రిప్పే రోజు. ఇతరులకు మరో రీతిగా ప్రముఖం కావచ్చు. ఈ పర్యాయం ఇంకా ఈ తేది ప్రముఖంగా గోచరిస్తున్నది. చిరకాలంగా కల్గుతున్న ఆత్మసాక్షాత్కారంవల్ల, పరబ్రహ్మలో చాలాగంటలు వసించటం మూలాన నా సాధన, ఆమోదముద్ర పొంది, పరాకాష్ట నధిషించిందని, పరిపూర్ణత నార్జించుకొన్నదనే చెప్పవచ్చు. అప్పటినుండి నాలోని 'అహంకారం' ఒక్క "అన్నమయ ఆత్మ"లో తప్ప, అంతటా నశించింది. ఈ భౌతిక జీవికింకా సాక్షాత్కార పరిపూర్ణత కలుగవలసివుంది. అప్పటికిగాని దానికి, ప్రాచీన వాసనాయుత దేహతాదాత్మ్యధ్యాసనుండిగాని, అప్పుడప్పుడు కల్గే బాహ్య సంస్పర్శ సంచారాదులనుండి కాని పరిపూర్ణ విముక్తి చేకూరదు.

నా భవిష్యత్ సాధన, జీవితానికి సంబంధించింది అంటే, అది

అనుష్ఠాన విజ్ఞానానికి, శక్తికి సంబంధించిందన్నమాట. కేవల విజ్ఞానానికి, శక్తికి అయితే అట్టిది నాకెప్పుడో సంక్రమించింది.

విజ్ఞానం, శక్తి అనేవి ఈ భౌతికజీవితంలోనే ప్రతిష్ఠితం కావాలి. నా సమస్త కార్యకలాప నిర్వహణానికి అవి ఉపయుక్తం కావాలి.

నా పైని లక్ష్యం పెట్టుకొన్నావు కాబట్టి పై అభిప్రాయాన్ని నీకు నేను వివరించి చెప్తాను. నన్నే విజ్ఞానకేంద్రంగా చూచుకొంటున్నావు కాబట్టి ఈ కేంద్రంనుండి ప్రసారితమయ్యే కాంతిపుంజ మెట్టిదో నీవు తప్పక గ్రహించాలి.

(1) సమగ్ర సనాతన ధర్మాన్ని ఆధునిక మానవ మేధకు వినూత్న దృక్పథంతో పునః ప్రబోధం చేయాలి. ఈ కార్యక్రమం ఎప్పుడో ప్రారంభమైంది. ఇందులో మూడు విభాగాలు స్పష్టంగా నిర్ణయింపబడ్డాయి.

శ్రీకృష్ణ పరమాత్మ వేదాలకు సరియైన అర్థం నాకు వివరించాడు. అంతేకాదు. ఆయన నాకు నూతన భాషాశాస్త్ర విజ్ఞానాన్నికూడా ప్రసాదించాడు. దీని సహాయ్యంతో మానవ భాషణోత్పత్తి నాకు బాగా అవగాహనమైంది. ఈ పరిజ్ఞానంతో క్రొత్త నిరుక్త రచన ఒకటి చేయవలసి వుంది. దీని ఆధారంతో వేదాలకు నూతనంగా వివరణం రాయవలసివుంది.

భారతీయులకుగాని, యూరోపియనులకుగాని అవగతంకాని ఉపనిషద్రహస్యాలు నా కవగతం చేశాడు ఆ కృష్ణభగవానుడు. కాబట్టి వేదాన్ని వేదాన్తాన్ని పునర్వికాసితం చేయవలసిన బాధ్యత నాపైని వుంది. సకలమతాలు ఇందుండే ఆవిర్భవించాయని, అంతటా మతం ఒక్కటేనని ఈ వివరణం విదితం చేస్తుంది. ఈ రీతిగా యావత్ప్రపంచ మత జీవితానికి భారతదేశమే కేంద్రస్థానమని నిరూపితమౌతుంది. అంతేకాదు, సకల ప్రపంచ మత సంరక్షణంకూడా ఈ భారతీయ సనాతన ధర్మంవల్లనే కల్గుతుందనే విధి

నిర్ణయాన్నికూడా నిరూపించవలసి వుంది.

(2) ఈ వేద పరిజ్ఞానం ఆధారంగా యోగసాధన విధానాన్ని నెల కొల్పాలి. ఇది ఆత్మ విముక్తిదాయకమేకాక సమగ్ర మానవ నిర్మాణాన్ని సమకూర్చుతుంది. ఇందువల్ల 'సత్యయుగం' పునరుద్ధరింపబడుతుంది. ఈ పని యిప్పుడు ప్రారంభం కావలసివుంది. అయినా కలియుగాంతానికి కానీ యిది పూర్తికాదు.

(3) ఆధ్యాత్మిక కేంద్రస్థానం భారతదేశం. ప్రపంచంలో దానికున్న ఉచితస్థానాన్ని అది తిరిగి పొందటానికి తగిన కృషి జరుగుతున్నది. ఈ పునరుద్ధరణ కార్యక్రమం, పై కార్యక్రమంలో ఒక భాగంగానే వుంటూ, యోగసాధనవలన సకలమానవులకు సంబంధించిందిగాకూడా వుంటుంది.

(4) సంపూర్ణ మానవతా నిర్మాణం ధ్యేయం కాబట్టి సంఘ పున ర్వ్యవస్థీకరణం జరగాలి. అప్పుడుకాని అది సంపూర్ణత్వాన్ని తనలో ఇముడ్చుకోలేదు.

యోగసాధనాన్ని సమగ్రంగా మీకు చెప్పలేదనే సంగతి తప్పక జ్ఞాపకముంచుకోండి. తొలిపాఠం మాత్రమే చెప్పాను. అహంకారాన్ని త్యజించి, ఆశను తుడిచిపెట్టి భగవంతునకు ఆత్మ సమర్పణం చేసుకోవాలి. ఆ విధంగాగాని మిగిలింది నీకు అవగతం కాదు. "యోగసాధన — దాని లక్ష్యాలు" అనే పుస్తకం ముద్రించాలని చెప్తున్నావు. కాని మీకు నేను పంపింది మార్గాన్ని చూపే తొలిభాగం మాత్రమే. అందులో యోగలక్ష్యాలు, యోగసాధన స్థితిగతులు లేవు. దాన్ని ముద్రిస్తే 'తొలిభాగం' అనే ఉపశీర్షిక నుంచేది. ఇంకా కొన్ని భాగాలు రాగలవని అందువల్ల తెలుస్తుంది.

ఈశావాస్యోపనిషత్తును ౧౨ అధ్యాయాల్లో వ్యాఖ్యానించే పనిలో నే నిప్పుడు నిమగ్నుడనై వున్నాను. ఇప్పుడు పదకొండో అధ్యాయంలో

వున్నాను. కొద్దిరోజుల్లో పూర్తి అవుతుంది. ఆ తరువాత ఈ యోగవిద్యా సంబంధమైన ద్వితీయభాగాన్ని పూర్తిచేసి పంపుతాను.

ఇంక నా కర్తవ్యంలో రెండోభాగంకూడా అల్పంగానే కానీయండి, ప్రారంభించాను. నాకు సంప్రాప్తమైన సిద్ధిని ఎన్నికైన కొద్దిమందికి మాత్రమే చేకూర్చి, రానున్న నూత్నశకానికి అర్హుల్నిచేయాలని నా ఆశయం. ఈ దృష్టితో తిలకిస్తే, ఈ మన 'ఆశ్రమం' ఒక ప్రయోగశాల అవుతుంది. లేదా దీన్నో నారుమడిగా భావించవచ్చు. ఇక్కడ చేసిన ప్రయోగాలు క్రమంగా ఇతరత్ర కూడా వ్యాప్తమౌతాయి.

ఇక్కడ పని బాగా వృద్ధిపొందుతున్నది. ఎట్టకేలకు కొన్ని నిర్దుష్ట విధానాలు నెలకొన్నాయి. నిలకడ చిక్కింది. గమనమంత త్వరితం కాక పోయినా స్థిమితంగా సరియైన ఫలితాలు సమకూరుతున్నాయనే చెప్పవచ్చు.

మీరక్కడ సాధిస్తున్న లక్ష్యాలేమిటో స్పష్టంగా నీనుండి తెలుసుకొని సంతోషిస్తాను. ఎందుకంటె, నా దృష్టిపథం ఇంకా అవరోధాలనుండి విముక్తి పొందలేదు. అందుచేత ఈ స్థితిలో నేను తెలుసుకోవాలని అభిలషిస్తున్న విషయాలు పూర్తిగా తెలుసుకోలేకపోతున్నాను.

రామకృష్ణ మిషన్ను గూర్చి నీవు చెప్పిందాంతో నేనుకూడా ఏకీభవిస్తున్నానని చెప్పటానికి సాహసిస్తున్నాను. ఆ ఉద్యమాన్ని వ్యతిరేకించవద్దు. దానితో ఘర్షణ పడవద్దు. రామకృష్ణ పరమహంసనుండికూడా మనం ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని సముపార్జించు కొంటున్నామనే సంగతి జ్ఞాపకముంచుకోవాలి. తొలుత రామకృష్ణుడే స్వయంగా వచ్చి నన్ను యోగమార్గంలో ప్రవేశపెట్టాడు. నేటి నా సాధనకు ప్రాతిపదికయైన విజ్ఞానానికి పునాదుల్ని, నేను ఆలీపూర్ కారాగారంలో వుండగా వివేకానందుడే చేకూర్చాడు. కాని 'మిషన్'లో వున్న దోషమేమంటే, శ్రీ రామకృష్ణ వివేకానంద రూపాలకే

విశేషంగా అంటిపెట్టుకొని వుండడం. అందువల్ల తాత్త్విక చింతనలో తమ వినూత్న భావ విస్ఫూర్తికి ఆ 'మిషన్' వారి హృదయ కవాటాలు తెరుచుకోటం లేదు. ఈ విధమైన లోపం సర్వసాధారణంగా సకల క్రైస్తవాలయాల్లోను, మత వ్యవస్థల్లోను పొడగట్టేదే.

తాంత్రిక వాఙ్మయంలోని ఇంకో గ్రంథాన్నిగూర్చి నాకింకా సరియైన పరిజ్ఞానం కల్గలేదనే చెప్పాలి. పరాశక్తి తన్నుతాను ఆవిష్కరించుకోటానికి మాత్రమే సంసిద్ధంగా వుంది. కాని ఆమె ఏ మార్గాన్ని చేబడుతుందో తెలియటం లేదు. నేను దేన్నిగూర్చి ఆలోచించనని, ఎట్టి నిర్ణయాలు చేయనని నీకు తెలిసే వుండవచ్చు. ఆమంతటామే తన పద్ధతిని తానెన్నుకుంటుంది. లేదా, కృష్ణ పరమాత్మ తనకై నిర్ణయించి చూపిన మార్గాన్ని ఆమె అనుసరిస్తుంది.

ద్రవ్యానికేదో ఏర్పాటు చేసినందుకు సంతోషం. ఇతరులనుండి సేకరించినా సరే, మీ యంతట మీరు సమకూర్చుకొన్నా సరే. నాకా విషయం అనవసరం, నేను పట్టించుకోను. సాధన కత్యవసరమైన నా శక్తియుక్తులు దుర్వినియోగం కాకుండా వుంటే చాలు. నా మీద ఉంచబడ్డ కార్యభారం అధమస్థాయికి దిగజారి వృథా కాకుండావుంటే సరి.

భౌతిక నిరోధం పూర్తికాగానే నీకీ బరువు తొలగుతుంది. కాని అది త్వరలో కల్గుతుందో, ఆలస్యమే అవుతుందో చెప్పలేను.

భగవంతునికి ఆత్మ సమర్పణం చేసుకొన్నవారికి బహుమతి లభించక పోదు. బహుమానం ఏవిటో నిర్ణయించేది ఆ భగవంతుడే.

ఈ కేంద్ర ప్రాముఖ్యాన్ని సదా సంస్మరించేది. ఎందుకంటే నా భవిష్యత్ సకల కార్యకలాపాలు, ఇక్కడ నేను సాధించినదానిపై ఆధారపడి వుంటాయి..................

# నా ధ్యేయం

యోగాభ్యాసంవల్లవచ్చే ఉన్నతమైన ఆధ్యాత్మిక చైతన్యస్థాయికి నేను చేరుకున్నమాట నిజం. దానిమూలంగా కొంతశక్తి లభిస్తుంది. ముఖ్యంగా ఆ శక్తివల్ల సంసిద్ధముగా ఉన్నవారితో భావప్రసారం చేయగలగడం, పరిపక్వంచెందిన ఏ ఆధ్యాత్మికస్థితిలో నిశ్చలమైన లోపలిప్రశాంతి, శక్తి, ఆనందము కలుగునో అటువంటి ఆధ్యాత్మికస్థితిని చేరుకోడానికి సహాయపడగలగడం జరుగుతుంది. కాని ఈ ఆధ్యాత్మిక శాంతి ఆనందము మానసికంగా పొందగలిగే శాంతి ఆనందముకంటె వేరుగా వుంటుంది. ఆధ్యాత్మికశిక్షణ లేనిదే దానిని పొందడం సాధ్యంకాదు....... ....

దీనినిగురించి సరిగా బోధపరచడం జరిగిందో లేదో ఎరుగను. సంక్షిప్తంగా చెబుతాను. రెండు చైతన్యస్థాయిలున్నాయి. వాటిలో ఏదైనా ఒకదానిలో మానవుడు జీవించవచ్చు. జీవనలీలను పాలిస్తూ దానికి పైన నిలచే ఉన్నతచైతన్యం ఒకటి కలదు. దానిని ఆత్మ, ఆధ్యాత్మ లేక ఈశ్వరత్వం అని పలువిధములుగా అంటారు. తక్కిన చైతన్యం సాధారణంగా మానవులు జీవించే సామాన్యస్థాయి. అది ఆధ్యాత్మిక జీవనలీలలో పరికరంగా ఉపకరించే బాహ్యస్థాయి. సామాన్య చైతన్యస్థాయిలో జీవించేవారు మనస్సుయొక్క సామాన్య కదలికలకు లోనై స్వాభావికమైన సుఖదుఃఖాలకూ, కాంక్షలకూ, తాపత్రయాలకూ, జీవితంయొక్క ఒడుదుడుకులకూ గురి అవుతూ ఉంటారు. మానసికమైన సుఖశాంతులు వారు పొందవచ్చును కాని అవి శాశ్వతమైనవీ, స్థిరమైనవీ కానేకావు. కాని ఆధ్యాత్మికచైతన్యం అంతా తేజోమయం, శాంతిమయం, శక్తిమయం, ఆనందమయం. దానిలోనే పూర్తిగా ఎవరైనా ఉండగలిగితే ప్రశ్నేలేదు. ఇవన్నీ సహజంగానూ, పదిలం

గానూ అతని సొంతం అవుతాయి. కాని, దానిలో కొంతవరకైనా జీవించ గలిగితే, దానివైపు నిరంతరం తెరుచుకొని ఉండగలిగితే, అతడు జీవితంలో ఎదురయే అన్నిరకాల ఘోర విపత్తులనూ తట్టుకుని నిలువగలగడానికి చాలి నంత కాంతీ, శాంతీ, శక్తీ, ఆనందమూ అతనికి లభిస్తాయి. ఈ ఆధ్యాత్మిక చైతన్యానికి అభిముఖంగా తెరుచుకుని ఉండడంవల్ల ఏమి లభిస్తుందనేది దాని వల్ల ఎమి కోరుకుంటాడో దానిమీద ఆధారపడివుంటుంది. శాంతి కావాలంటే శాంతి లభిస్తుంది. వెలుతురూ, జ్ఞానమూ కావాలంటే గొప్ప వెలుతురులో ఉండడం, సామాన్య మానవమనస్సు పొందే వెలుతురు, జ్ఞానము కంటె ప్రగాఢమైన, ఎక్కువ సత్యమైన వెలుతురూ, జ్ఞానమూ లభిస్తాయి. బలమూ, శక్తీ కావాలంటే అంతర్జీవనాన్ని నడపగలిగినంతటి ఆధ్యాత్మిక బలమూ, బాహ్యమైన కర్మలను ఆచరించడానికి తగినంత యోగశక్తీ లభిస్తాయి. ఆనందమే కావాలంటే సామాన్య మానవజీవితం యివ్వగలిగిన దానికంటె గురుతరమైన ఆనందం లభిస్తుంది.

ఈ దివ్య చైతన్యానికి అభిముఖంగా తెరుచుకోడంలోను దానిలో ప్రవేశించడంలోను అనేక మార్గాలున్నాయి. నిరంతరాభ్యాసం ద్వారా నేను యితరులకు చూపించే నా మార్గం ఏమిటంటే అంతర్ముఖం కావడమూ, ఆకాంక్షతో ఈశ్వరాభిముఖం కావడమూ, దాని క్రియా చైతన్యం కలిగిన వెంటనే ఈశ్వరునికి పూర్తిగా ఆత్మసమర్పణం చేసుకోవడమూను. ఈ ఆత్మసమర్పణం యొక్క అర్థం ఏమిటంటే దివ్యచైతన్యంతో నిరంతర స్పర్శ తాదాత్మ్యము కలిగి ఉండడంతప్ప వేరే ఏదీ కోరకపోవడము, దాని యొక్క శాంతి. శక్తి, వెలుతురు ఆనందంకోసం కాంక్షించడము, జీవితంలో ప్రతిపనిలోనూ ఈ లోకంలో ఈశ్వరాజ్ఞ ప్రకారం చేయడానికి ఈశ్వరుని చేతిలో పనిముట్టు కావడంతప్ప వేరే ఏదీ కోరకపోవడమూను. దివ్య శక్తికి అభిముఖంగా తెరుచుకొని మనస్సులోను, హృదయంలోను, శరీరం

లోను పనిచేస్తున్న ఆధ్యాత్మికశక్తిని అనుభవించడం ఒక పర్యాయం జరిగి నట్లయితే యిక జరగవలసినదల్లా దానిపట్ల విశ్వాసం కలిగివుండడం. దానినే నిరంతరం కోరుకోవడం, అది వచ్చినప్పుడు దాని పనిని చేసుకోనివ్వడం. దిగువ చైతన్యానికి, దిగువ ప్రకృతికి చెందిన తక్కిన ప్రతి తక్కువశక్తినీ నిరాకరించడమూను.

నా పరిస్థితినీ, నా యోగశక్తినీ విశదపరచడానికి యింత వ్రాశాను. నా ఈ యోగాన్ని అభ్యసించవలసినదిగా నేను మామూలుగా ఎవరినీ అడగను. ఎందుకంటే అది మొదటినుంచీ గాఢమైన అభిరుచి ఉన్నవారికి మాత్రమే లేక గాఢమైన అభిరుచిని పెంపొందించుకున్నవారికి మాత్రమే సాధ్యం అవుతుంది. తక్కినవారు చివరివరకూ నిలువలేరు. కేవలం బాహ్యమైన శాంతి అవసరమనుకునేవారికి సహాయం చేయడానికి కొన్ని సందర్భాలలో నిరాకరించకపోయినప్పటికీ తరచు నా మార్గం విడిచి వెళ్ళను. ఉన్నత చైతన్యాన్ని దిగువకు తేవడానికి ఆత్మచైతన్యం కేవలం 'ముక్తి'ని సాధించడానికి మాత్రమే కాకుండా భూమిమీద దివ్యజీవనాన్ని సాగించడానికి ఒక శక్తిగా ఉపకరించేటట్లు చేసే ఆధ్యాత్మిక జీవనానికి కేంద్రాన్ని సృష్టించడమే నా ధ్యేయం. ఈ ఉద్దేశ్యంతోనే నేను ప్రజారాజకీయ జీవితంనుంచి ఉపసంహరించుకుని పుదుచ్చేరిలో ఈ ఆశ్రమాన్ని స్థాపించాను. దీనిని ఆశ్రమం అనడానికి కారణం అంతకుమించిన మంచిమాట లభించకపోవడమే. ఎందుకంటె ఇది సన్యాసుల ఆశ్రమం కాదు. దీనిలో తక్కినవన్నీ విడచి ఈ శిక్షణకు తయారుకాదలచిన వారుంటారు. కాని అదే సమయంలో తమ సంసారాలు చేసుకుంటూకూడా దూరంనుంచి నా ఆధ్యాత్మిక సహాయాన్ని పొందే కొంతమంచి శిష్యులు భారతదేశం అంతటా నాకు కలరు..........

# జాతీయ జాగరణము

మూలము: శ్రీ అరవిందులు

(1909 సం॥ తరువాత, అనగా శ్రీ అరవిందులు యోగసిద్ధిని ఆత్మ సాక్షాత్కారమును బడసినతరువాతనే, అనగా ఏకకాలమందే, అంతరమున విశాల నీరవత ననుభవించుచు బాహ్యమున తీవ్రప్రవృత్తి మార్గమున నిమగ్నమై యుండగల అసాధారణ అనుభూతి నందినతరువాత, సర్వత్ర సర్వమునందు సర్వసంఘటనలందు సర్వేశ్వరునిదర్శించి సత్యమునెఱింగి ఆధ్యాత్మికదృష్టితో ననేక సమస్యలను గురించి, ఈ వ్యాసముల రూపమున రచించియుండిరి.)

భగవంతునిలీల మిక్కిలి విచిత్రము. ఆతని సృష్టియందు శుభాశుభముల సంఘటనచే జగతియొక్క క్రమోన్నతి నిర్వర్తింపబడుచున్నది; ప్రాయికముగా అశుభము శుభమునకు సాయపడుచున్నది; భగవంతునికేది అభీప్సితమో అట్టి శుభమయమైన ఫలమును ప్రసరింపజేయుచున్నది. ఈ ద్వేష మేర్పడుట అత్యంతము అశుభము. అయినను దానినుండి ఈ శుభఫలము తమస్సునందు పడియున్న భారతీయులందు రాజసికశక్తిని మేల్కొలుపుటకేది ఆవశ్యకమో, అట్టి యుత్కటమైన రాజసికప్రేరణ—ఉత్పన్నమయ్యెను. ఆ కారణముచే మేము అశుభమునుగాని అశుభము నాచరించు వారలనుగాని ప్రశంసింపజాలము. ఎవడు రాజసికాహంకారమునకు లోగి అశుభమును చేయునో, అతని కార్యము ద్వారమున ఈశ్వర నిర్దిష్టమైన శుభఫలమునకు సాయము కల్గుచున్నదనే హేతువుచే, ఆతని బాధ్యతకాని కర్మఫలానుభవ రూపమైన బంధనముకాని అంతరించిపోవు ఎవరొక జాతియెడ ద్వేషమును ప్రచారము చేయెదురో వారు భ్రాంతులు. ద్వేషప్రచారముచే కలిగెడు ఫలము కంటే పదిరెట్ల ఫలము నిఃస్వార్థ ధర్మ ప్రచారముచే కలుగును. దానివలన, అధర్మమును అధర్మజనితమైన పాపఫలభోగమును కలుగుటకు బదులుగా,

ధర్మవృద్ధియు అమిశ్రపుణ్యముయొక్క సృష్టియును సంఘటించును. మేము జాతికి జాతిపై పగయును ఏవమును కలిగించు మాటలను వ్రాయము. ఇట్టి అనర్థమును కలిగింపవలదని ఇతరులనుగూడ వారింతుము. జాతికిని జాతికిని స్వార్థవిరోధ ముదయించినప్పుడు, లేక అట్టి విరోధము వర్తమానస్థితికి అపరిహార్యమైన అంగస్వరూపమై నిలచియున్నప్పుడు, మనము పరజాతి యొక్క స్వార్థమును వినష్టము చేయుటకును స్వజాతియొక్క స్వార్థమును సాధించుటకును చట్టము, ధర్మము, నీతి ఈ అన్నిటిబట్టియు అధికారులము. అత్యాచారముగాని అన్యాయముగాని తటస్థించినప్పుడు, మనము దానిని తీవ్రముగా ఖండించియు, జాతీయశక్తిని దానికెదురొడ్డియు, సకలవిధ వైధోపాయములచేతను వైధప్రతిరోధముల ద్వారమునను దానిని తొలగించుటకు చట్టము, ధర్మము, నీతి ఈ అన్నిటిబట్టియు అధికారులము దేశీయుడుగాని, విదేశీయుడుగాని ఎవ్వడైనను అశుభజనకమైన అన్యాయమును లేక అక్రమ కార్యమును జేసినప్పుడు లేక అసంగతమైన మతము బయలుపఱచినప్పుడు, భద్రసమాజోచితమైన ఆచరణకు విరోధింపనిరీతి పరిహాస తిరస్కారములచే ఆ కార్యమునకును మతమునకును ప్రతివాద ఖండనముల గావించుట కధికారులము. కాని ఏ జాతియెడగాని ఏ వ్యక్తియెడగాని అవజ్ఞాద్వేషముల బోషించుటకు సృష్టించుటకు మన మధికారులము కాము. గతమునందొకవేళ ఇట్టి దోషము ఘటించెనేని అది గతము మాట. ఇకముందీ దోషము ఘటింపకుండుటకై ఎల్లరికిని, ముఖ్యముగా జాతీయపక్షపు వార్తాపత్రికలకును కార్యసాధకులైన యువకబృందమునకును, ఈ ఉపదేశము నిచ్చుచున్నాము.

ఆర్యజ్ఞానము, ఆర్యశిక్ష, ఆర్య ఆదర్శములును మఱియు జడజ్ఞానవాదులును రాజసికులును భోగపరాయణులును ఐన పాశ్చాత్య జాతీయుల జ్ఞానశిక్షాదర్శములును అత్యంత భిన్నములు. యూరోపియనుల మతమునందు స్వార్థముగాని సుఖాన్వేషణముగాని లేనిచో కర్మ ఆచరింపరానిదే అగును.

'ద్వేషములేనిచో విరోధమును యుద్ధమును అసంభవము. ఒకపక్షమున సకామకర్మ నాచరింపవలయును; లేదా రెండవపక్షమున కామనాహీనుడైన సన్న్యాసియై కూర్చుండవలయును', అనియే వారల యభిప్రాయము; 'జీవితార్థమైన సంఘర్షణము మూలమున జగము నిర్మింపబడినది. జగముయొక్క క్రమోన్నతి సాధింపబడుచున్నది'. అనియే వారల విజ్ఞానముయొక్క మూలమంత్రము. ఆర్యులు ఉత్తర కురు భూములనుండి దక్షిణముగా యాత్రచేసి పంచనద భూమిని ఆయత్తము చేసికొనిన నాటినుండియు ఏ సనాతన శిక్షను ప్రాపించి దానితోపాటు జగమునందు సనాతన ప్రతిష్ఠనుగూడ బ్రాపించిరో, ఆ సనాతన శిక్ష యిది. ఈ విశ్వ మానందధామము; ప్రేమ, సత్యము, శక్తి వీని వికాసముకొఱకై సర్వవ్యాపకుడైన నారాయణుడు స్థావరజంగమునందు మనుష్య పశు కీట పతంగములందు, సాధువులందును పాపులందును, శత్రువులందును మిత్రులందును, దేవతలందును అసురులందును. ఆత్మప్రకాశమొనర్చుకొని జగద్వ్యాప్తమగు క్రీడను గావించుచున్నాడు; క్రీడకొఱకే సుఖదుఃఖములు, క్రీడకొఱకే పాపపుణ్యములు, క్రీడకొఱకే మిత్రత్వ శత్రుత్వములు, క్రీడకొఱకే దేవత్వ అసురత్వములు; మిత్రులు శత్రులు ఎల్లరును క్రీడయందలి సహచరులు; రెండుపక్షముల క్రింద విభక్తులై స్వపక్ష విపక్షములను సృష్టిచేసినారు. ఆర్యుడు మిత్రుని రక్షించును, శత్రువుని నిగ్రహించును; కాని అతని కాసక్తిలేదు. అతడన్నిటను అన్ని భూతములయందును అన్ని వస్తువుల యందును, అన్ని కర్మలయందును, అన్ని ఫలములయందును-నారాయణుని దర్శించి, ఇష్టానిష్టములందును శత్రుమిత్రులందును, సిద్ధియందును అసిద్ధియందును సమభావముతో వర్తించును. సకల పరిణామములును అతనికిష్టమని కాని, సకల జనులును ఆతనికి మిత్రులనికాని, సకల ఘటనలును అతనికి సుఖదాయకములనికాని, సకల కర్మలును అతనికి ఆచరణీయములనికాని, సకల ఫలములును అతనికి వాంఛనీయములనికాని ఈ

చెప్పినదాని యర్థముకాదు. సంపూర్ణమైన యోగప్రాప్తి లేనిది ద్వంద్వములు ముగియవు. ఆ స్థితి కొలదిమందికే చేరనగును.

కాని ఆర్య శిక్ష ఆర్యుల సాధారణ సంపత్తి. ఆర్యుడు ఇష్టమును సాధించుటకును, అనిష్టమును వర్జించుటకును ప్రయత్నమొనర్చును; కాని ఇష్టలాభమునందు జయమదముచే మత్తుడు కాడు, అనిష్ట ప్రాప్తియందు జంకిపోడు. మిత్రునకు సహాయమును శత్రువునకు పరాజయమును అతని ప్రయత్నముయొక్క ఉద్దేశ్యములు; కాని అతడు శత్రువుని ద్వేషింపడు, మిత్రునియెడ అన్యాయ పక్షపాతమును వహింపడు. కర్తవ్యముయొక్క అనురోధము ననుసరించి స్వజన సంహారమును చేయుటకుగూడ సమర్థుడు. విపక్షుల ప్రాణరక్షణకై తన ప్రాణములగూడ త్యజించుటకు సమర్థుడు. సుఖము అతనికి ప్రియము, దుఃఖమతని కప్రియము; కాని అతడు సుఖము నందధీరుడు కాడు, దుఃఖమునందును అతని ధీరతయు ప్రీతి భావమును చెదరక నిలుచును. అతడు పాపమును విడనాడును, పుణ్యమును సేకరించును. కాని పుణ్యకర్మచే గర్వితుడు కాడు; పాపమున బడినచో దుర్బలుడై బాలకుని విధము ఏడ్వడు; నవ్వుతో తొంపిలోనుండి లేచి, బురదను తుడిచి వైచి, ఒడలిని శుభ్రమును శుద్ధమును గావించి తిరిగి ఆత్మోన్నతికై ప్రయత్నపడును. ఆర్యుడు కర్మసిద్ధికై అత్యంతము పరిశ్రమించును. వేయి పరాజయముల చేతనైనను వెనుకకు పోడు కాని అసిద్ధిచే దుఃఖితుడగుటగాని విషణ్ణుడు లేక విరక్తుడగుటగాని అతని పట్టున అధర్మము. యోగారూఢుడై ఎవడు గుణాతీత భావముతో కర్మ నాచరించుటకు సమర్థుడగునో, అతని పట్టున ద్వంద్వములు అవశ్యము ముగిసిపోవును; జగన్మాత ఏ కార్యము చూపునో, విచారణ వినా అతడు దానినే చేయును, ఏ ఫలమొసగునో ఆనందముతో దానినే భుజించును; స్వపక్షీమని ఎవ్వరిని నిర్దేశించునో వారలగై కాని తల్లియొక్క పనుపును నిర్వర్తించును; విపక్షులని ఎవరిని చూపించునో

ఆజ్ఞానుసారమున వారిని దమనము చేయును లేక సంహారించును. ఇదియే ఆర్యశిక్ష. ఈ శిక్షయందు ద్వేషమునకును తృణీకారమునకును తావులేదు. ఎల్లెడను నారాయణుడు. ఎవ్వరిని ద్వేషింతును? ఎవ్వరిని తృణీకరింతును?

మనము పాశ్చాత్యభావముతో రాజకీయాందోళనము చేయునప్పుడు ద్వేష తిరస్కారము లనివార్యముగా కలిగినచో, పాశ్చాత్యుల మతమునందలి నింద్యములు కావు; ఏలన స్వార్థములలో విరోధము కలదు. ఉత్థాన మొక పక్షమునకు దమనము రెండవ పక్షమునకును తటస్థించుచున్నది. కాని మన ఉత్థానము కేవలము ఆర్యజాతియొక్క ఉత్థానము మాత్రమేకాదు; అది ఆర్య చారిత్రము, ఆర్య శిక్ష, ఆర్య ధర్మము. ఈ అన్నిటియొక్కయు ఉత్థానము, ఆందోళనముయొక్క ప్రథమ దశయందు పాశ్చాత్య రాజనీతియొక్క ప్రభావము మిక్కిలి ప్రబలమైయుండెను; అయినప్పటికిని ఆ ప్రథమ దశయందే ఈ పై సత్యము మనకు గోచరించెను: మాతృపూజ, మాతృప్రేమ, ఆర్యాభిమానము వీని తీవ్రానుభవముచే ధర్మ ప్రధానమైన ద్వితీయదశ ఏర్పడినది. రాజనీతి ధర్మముయొక్క అంగము. కాని అది ఆర్య భావముతో, ఆర్య ధర్మము నామోదించెను. ఉపాయములతో ఆచరింపబడవలయును. మా భవిష్యదాశయొక్క స్వరూపమైయున్న తరుణ బృందమునకు మేము చెప్పునదిది: మీ ప్రాణమందు ద్వేషమున్నచో వెంటనే దాని నున్మూలింపుడు. ద్వేషముయొక్క తీవ్రమైన ఉత్తేజనచే క్షణికమును రజఃపూర్ణమును అగు భావము సులభముగా జాగరిల్లును. కాని శీఘ్రముగా భగ్నమైపోయి దౌర్బల్యమున పరిణమించును. ఎవరు దేశము నుద్ధరించుటకై కంకణము కట్టుకొనియున్నారో, ప్రాణములనుగూడ అర్పణము చేసియున్నారో వారియందు ప్రబలమైన భ్రాతృభావము కఠోరమైన ఉద్యమము, లోహసమమైన దార్ఢ్యము జాజ్వల్యమానమగు అగ్నియొక్క తేజము, వీనిని సంచరింపజేయుడు. ఈ శక్తిచే అభగ్న బలము మనకు చేకూరును, చిర విజయము సిద్ధించును.

# నా ధర్మము

నాకిచట నొక క్షణముకూడ నవకాశము లేదు; వ్రాతభారము నాపై నున్నది. కాంగ్రెసునకు సంబంధించిన కార్యభారము నాపై నున్నది; 'వందే మాతరం' గిజాటును సర్దుబాటుచేయు భారము నాపై నున్నది. నేనీ యన్నిటితో నెగ్గలేకున్నాను. అదిగాక నాకు నా సొంతపనికూడ గలదు. దానిని త్రోసివేయుటకును వీలులేదు.

నా మాట ఒకటి విందువా? నాకిది మిక్కిలి వ్యాకుల సమయము. నాల్గు వైపులనుండియు పిచ్చి ఎత్తించదగినంత ఒత్తిడి. ఈ సమయమున నీవు అస్థిరురాల వగుదువేని నా చింతావ్యాకులత్వములుగూడ హెచ్చగును. నీవు ఉత్సాహముతోడను సాంత్వనముతోడను నింపి ఉత్తరము వ్రాయుదువేని నాకు మిక్కిలిశక్తి లభించును. ప్రఫుల్ల చిత్తముతో అఖిల విపత్తులను, భయములను అతిక్రమింప సమర్థుడ నగుదును. దేవఘరులో ఒంటరిగా నుండుట నీకు కష్టమని ఎఱుగుదును; ఐనను మనసును గట్టిచేసికొని విశ్వాసముపై ఆధారపడితివేని దుఃఖము మనస్సుపై అంత అధికారము చలాయింపనేరదు. ఎపుడు నాతో నీ వివాహమయ్యెనో అపుడు నీ భాగ్యమునందీ దుఃఖ మనివార్యము, మధ్య మధ్య ఎడబాటు కలుగకతప్పదు. ఏలన, నేను సాధారణ బంగాళీలవలె కుటుంబము యొక్కయు స్వజనము యొక్కయు సుఖమే ముఖ్యోద్దేశముగ గ్రహింపజాలను. ఈస్థితియందు నా ధర్మమే నీ ధర్మము. నాకు నిర్దేశింపబడిన కార్యముయొక్క సఫలతయే నీ సుఖముగా భావింపవేని నీకు వేఱు మార్గములేదు. మఱి ఇంకొకమాట. ఎవరితో నీవిప్పుడున్నావో వారలనేకులు నీకును నాకును గురుజనులు; వారు పరుషవాక్యములు పలికినను, అన్యాయపు మాటలాడినను వారలపై కోపగింపకుము. మఱియు వారల

నోట వచ్చినదంతయు వారి హృదయములోని మాటయే యనికాని, నిన్ను కష్టపెట్టుటకై పలుకబడినదనికాని తలపబోకుము. పెక్కుమారులు కోపము యొక్క వేగమునందు అనాలోచితముగానే మాటలు వెలువడుచుండును. వానిని పట్టుకొనియుండుట మంచిదికాదు. ఒకవేళ అక్కడనుండుట నీకు అత్యంతమును సాధ్యము కాదేని గిరీశబాబుతో చెప్పుదును. నేనెన్నాళ్ళు కాంగ్రెసులో నుందునో అంతవరకు మీ అన్నగారు ఇంట నీతో ఉండగలరు.

నేడు మేదినీపురము పోవుదును. తిరిగివచ్చి ఇచట వలసిన ఏర్పాటంతయు చేసి సూరతు పోవుదును. బహుశః 15 లేక 16వ తేదీని వెళ్ళుట పడును. జనవరి 2వ తారీఖున తిరిగివత్తును.



# సనాతనధర్మము

మనము తఱచు సనాతనధర్మమైన హిందూమతమును గురించి మాట లాడుచుందుమేగాని మనలో బహు కొలదిమందికి మాత్రమే ఆ మతమనగా నేమో తెలియును. తదితర మతములన్నినో—ప్రబలమైన యొక వృత్తిగనో లేదా విశ్వాసముతో కూడినవిగనో యున్నవి. కాని మన సనాతనధర్మము సజీవమైనది. అయ్యది స్వానుభవముచే పొందదగినదేగాని మాటలచే నమ్మింపదగినదిగాదు. ప్రత్యేకముగనున్న యీ ద్వీపకల్పమునందు మానవులకు మోక్షదాయినియైన యీ సనాతనధర్మము తరతరములనుండి పోషింపబడుచున్నది. ఈ ధర్మమును బోధించుటకే భారతమాత పైకి లేచుచున్నది. భారతదేశము యితర దేశములవలె స్వార్థముకొరకో లేక బలహీనముగానున్న యిరుగు పొరుగు దేశములపై దండెత్తి ఆ దేశములను అణగద్రొక్కుటకొరకో పైకి లేచుటలేదు. భారతమాతకు అప్పగింపబడిన నిత్యజ్యోతిని సర్వవ్యాప్తముగ ప్రసరింపజేయుటకొరకే ఆమె అభివృద్ధి గాంచుచున్నది. స్వార్థరహితయైన యీ భారతమాత కేవలము మానవాభ్యుదయము కొరకే జీవించుచున్నది. అందులకే ఆమె అన్నివిధముల గొప్పది కావలసిన అవసరమున్నూ యేర్పడినది.